శ్రీరస్తు.

శ్రీమత్కోదండ రామాయనమః.

శ్రీమజ్జగత్ప్రాణతనయ వరప్రసాదలబ్ధ కవితాసంకలితుండగు

మద్దులపల్లి-గురుబ్రహ్మశర్మచే రచియింపఁబడిన

# శ్రీకొండపీటిచరిత్రము.

పద్యకావ్యము.



ఇది

పుణ్యపురుషకదంబ సహాయముచే

చెన్నపట్టణము

ఆనంద ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.



1907.

వెల [illegible] లు,



మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, గ్రంథకర్త.

Ananda Press, Madras.

శ్రీరస్తు.

# అవతారిక.



అఖండ మహీమండల మండనాయమానంబగు హిందూభూమండలము బహుకాలమునుండి భగవదంశసంభూతులగు పెక్కుమంది నృపతల్లజులచేఁ బాలింపఁబడుచున్నది. అట్టివారిలోఁ గలియుగాదివరకుఁ గల రాజులనుగూర్చి పూర్వమున వేదవ్యాసుండుపురాణరూపకముగ వివరించియున్నాఁడు. అందు కాలనిర్ణయాదులు లేకున్ననవియెల్ల నెల్లఱకు నిహపరసాధనోపాయములును నీతిబోధకములునై యున్నవి. తదుపరి గల రాజన్యుల వృత్తాంతముల నెవరును బ్రకటింపమి నవియెటుంగ దుస్తరము. అయిన నీకాలమున మహాఘనతజెందిన యాంగ్లేయప్రభువుల కృపాతిశయమున రమారమి 1000 సంవత్సరములనుండి గల హిందూ భూపతుల చరిత్రములు బయలుపడి ప్రసిద్ధినొందియున్నవి. ఇది యెంతయు సంతసనీయము. అయినను మనదేశీయులకు చరిత్రాదులు వ్రాయునాచరము బొత్తుగా లేనేలేదని నిరాకరించుటకు వలనుపడదు. ఎట్లనిన మనదేశమునఁ గొన్నికొన్ని స్థలములందు దండికవిలెలు (దేశచరిత్రములు)పూర్వులు వ్రాసియుంచినట్లును అందుఁ గొన్నికొన్ని వివిధకారణములచే నశించుచున్నట్లును వినుచున్నారము. ఇట్లగుటకు కారణమేమన "శ్లో॥ పుస్తకంవనితా విత్తం పరహస్తంగతంగతం, అథవాపునరాయాతం జీర్ణంభ్రష్టాచఖండశః." అను లోకప్రతీతిని మదినిడికొని మిగులభీతచేతస్కులై సంగతి సందర్భములఁ గని పెట్టకఁ దమకడఁగల పురాతనగ్రంథములఁ బరులకీయకను, భద్రపరుచునూహలెఱుంగకను ప్రచురించినచోఁ దమకడ గ్రంథములుండినపుడుండు గౌరవము గ్రంథములు లేకుండినఁ దగ్గుననియును మొదలగు వెఱ్ఱితలంపులచే మనవారిలోఁ గొందరు పూర్వనిర్మితములగు బహుగ్రంథములను శ్వేతపిపీలిక పావకాదుల కర్పించుచున్నారు. ఇది మిక్కిలి చింత్యముకా

డె. ఆంగ్లేయ ప్రచురిత చరిత్రాదులందు విస్తరించి యుత్తర హిందూస్థాన ప్రభువులనుదక్క దక్షిణహిందూస్థాన పాలకులఁగూర్చి చెప్పబడకుండుటచే మధ్యదేశ్యులు దమపూర్వప్రభుచరిత్ర తెలియంగ నిచ్ఛగలిగి యాంగ్లేయ ప్రచురిత చరిత్రలకు మిక్కుటము తృప్తినొందకుందురని తోఁచెడిని. ఇట్లుండ 1898 సం॥ ప్రాంతములందు గుంటూరు మండలములోని నర్సారావుపేటకు రాజకీయోద్యోగము(డిప్యూటి కలెక్టరు)వహించియరుదెంచిన బ్ర-మ-రా-రా-శ్రీ జయంతిరామయ్య పంతులు (బి.ఏ.,బి.ఎల్.)గారి యనుకంపచేఁ బ్రాచీనములై యంతరువులుపడి మూలలడాగియున్న చరిత్రములలో కొన్ని బయలుపడినవి. ఇందువలన మనకు మనదేశ ఘనత నెఱుఁగ నవకాశముగలిగినది. ఇందులకు మనమెల్లరము కృతజ్ఞులమై యున్నారము. ఆకాలమున గుంటూరుజిల్లా వినుకొండతాలూకా తిమ్మాపురాగ్రహారపతులగు బ్ర-మ-రా-రా-శ్రీ భాస్కరుని సీతారామయ్య,గోపాలరాయుడు గార్లవలన నొసంగబడిన యీకొండవీటిచరిత్రము "కొండవీటికైఫియ్యతు" అనుపేర తెలుగువచనమున కాలనిర్ణయములతో వ్రాయబడియున్నది. దీనిని మేమెల్లరముగాంచి సంతసించితిమి. ఇది పద్యకావ్యరూపకముగనుండిన మేలని స్నేహితులుసెప్ప వినుకొండ నివాసియగు మద్దులపల్లి గురుబ్రహ్మశర్మనుగమమగుశైలిని ననవసరవర్ణన కల్పనాదులుచేసి వచనకావ్యగత చరిత్రము మాత్రము నాలుగాశ్వాసములుగ

ఈగ్రంథకర్త శ్రమించి విస్తరము చదువకపోయినను బుద్ధికుశలతచేతను, సాంగత్యోపయోగముచేతను కొంతపాండిత్యమును సంపాదించి యీగ్రంథమును వ్రాసెను. ఈయనసాహిత్యమునందుగాక సంగీతమునందును కొంతప్రవీణతఁబడసి స్వయముగాఁబాడనేర్చి ధ్రువోపాఖ్యానమును, గజేంద్రమోక్షణంబును యక్షగానరూపకముగ (హరికథశైలిని) వ్రాసినాడు. కావ్యదోషాదోషములఁగూర్చి విమర్శింతమన్నచో “ కాళిదాసమయూరాది కవులకైనఁగలవు తప్పులనంగనన్యులకులేవె ” అని కాను సూర్యప్పకవిగారు నుడివినరీతి నెల్లరకును నేదియో యొకలోపమైననుండకపోదు గాన నావిషయమును కవులకువదలి యిక చరితాంశమునకు

వ త్తము. ఇందలి కాల సంఖ్యలన్నియు శాలివాహన శకవత్సరములం గొ లుపఁబడినవి. దీనికి 78 కలిపిన హూణశకవర్షము తెలియును. ఇందు ప్రథ మాశ్వాసమున నీకొండవీడే విదర్భదేశ ముఖ్యపట్టణమగు కుండినమని యు నిందు భీమభూపాలుడును భీష్మకుడును ప్రభుత్వ మొనర్చిరనియు దమయంతికిని రుక్మిణికిని జన్మస్థానమనియు వ్రాయబడినది. ఇదిసంశయా స్పదవిషయమైయున్నది. ఎట్లనిన హైదరాబాదునకు నుత్తరమునగల బీడ ర్ దేశమే విదర్భయనియు దానికి ముఖ్యపట్టణము కుండినముగలదనియు "Madras Manual of the Administration" ను బట్టియు మఱికొన్ని నిదర్శ నములనుబట్టియు కనుపట్టుచున్నది. ఈకొండవీడు త్రిలింగక్షేత్ర (ఆంధ్ర మండలము) మధ్యనుండుటంచేసి యిది కుండినముకాదనుటకు సందియ ముండదు కాని యిది కుండినమని లోకప్రతీతిమాత్రము చిరకాలమునుండి వచ్చుచుండుటయేకాక పెక్కుదండకవితెలలందును వ్రాసియున్నది. గ్రం థకర్త యీనిదర్శనముల కొప్పుకొనుచూఁ దానుజేకొనిన మాతృకయం దుండుటచే నిట్లువ్రాసితినని చెప్పుచున్నాఁడు గాన నీవిషయమున నీకవి యాక్షేపణార్హుడుకాడని నాయభిప్రాయము. ఇది మనదేశమున బహు కాలము ప్రభుత్వసామ్రాజ్యమువడసి మిన్నయగు వన్నెకెక్కిన కొండవీటి చరిత్రమగుట వినవినదేశ్యులకు నుత్సాహకరముగాను నానందప్రదము గాను నుండకమానదు, కావున నెల్లరును స్వదేశ చరిత్రాభిమానమును వహించి మనకడనశింపుచున్న చరిత్రములను బయలుపఱపించి దేశౌన్న త్యమును ప్రకటింపనియ్యకొని పూర్వుల పరిశ్రమల నిరర్థకములుగాకుండ చేయుదురని కోరుచున్నాను.

ఇట్లు, సుజనవిధేయుడు,
గబ్బిట లక్ష్మీనరసింహం,
హెడ్ క్లర్కు,
పల్నాడు తాలూకా.

గురిజాల
1-10-1906.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.




| | పుటసంఖ్య. |
|---|---|
| ఇష్టదేవతాప్రార్థన ... ... ... | 1- 2 |
| కవిస్తుతి ... ... ... | 3- 4 |
| కర్తృవంశావతారము .. ... ... | 4-12 |
| (పీఠిక) | |
| శ్రుతగిరిపురవర్ణన ... ... ... | 12 |
| షష్ఠ్యంతములు ... ... ... | 13 |
| (కథాప్రారంభము) | |
| ఇంద్రుడు నారదునితో కథాప్రస్తావన సేయుట ... | 13-15 |
| కుండినవర్ణన ... ... ... | 15 |
| కన్యకలపుష్కరిణీవర్ణన ... ... .. | 18 |
| జలక్రీడాభివర్ణన ... .. ... | 18 |
| కుండినపురవర్ణన ... ... ... | 19-21 |
| భీమభూపాలునికథ ... ... .. | 21-22 |
| వసంతఋతువర్ణన ... ... ... | 22-23 |
| దమయంతీస్వయంవర వృత్తాంతము ... ... | 23-24 |
| దమయంతి నలునివరించుట ... ... | 25 |
| దమయంతి వివాహము ... ... .... | 25-26 |
| భీష్మకునికథ ... ... ... | 26-27 |
| రుక్మిణీదేవివర్ణన ... ... ... | 28-30 |
| రుక్మిణి శ్రీకృష్ణుని మోహించుట ... ... | 30-31 |
| భీష్మకుడు రుక్మిణి వివాహమునకు యత్నించుట ... | 32 |
| చైద్యుడు పెండ్లికి తరలివచ్చుట ... ... | 32-33 |

| | |
|---|---|
| | పుటసంఖ్య. |
| కృష్ణుడు చైద్యులద్రుంప కుండినమునకు వచ్చుట ... | 33-35 |
| రుక్మిణీ శ్రీకృష్ణులపరిణయము ... ... | 35-37 |
| షోడశదళకమలబంధము ... ... ... | 38 |
| నాగబంధము ... ... ... | 39 |
| శైలబంధము ... ... ... | 40 |


## ద్వితీయాశ్వాసము.


| | |
|---|---|
| విశ్వంభరదేవునికథ ... ... ... | 42 |
| గణపతి దేవునివృత్తాంతము ... ... | 43-44 |
| సూర్యగ్రహణవర్ణన ... ... ... | 44-45 |
| రాజు కృష్ణాస్నానమునకేగుట ... ... | 45-46 |
| మంత్రి ముద్రాదానముఁగోరుట ... ... | 47-48 |
| మంత్రి రాజ్యపాలనసేయుట ... ... | 48 |
| గోపరాజు రామన్నగారు కరిణీకముద్ధరించుట ... | 49-50 |
| శాసనశ్లోకములు ... ... ... | 50-51 |
| రెడ్లవృత్తాంతము ... ... ... | 52 |
| అల్లారెడ్డికి ధనములభించుట ... ...<br>అల్లారెడ్డి శ్రీరాఘవస్వామిని స్తుతించుట ... ... | 53-57 |
| స్వప్నమున రెడ్డికి స్వామిప్రత్యక్షమగుట ... | 57-58 |
| అల్లారెడ్డి కుండినదేశమునకుఁజేరుట ... ... | 58-59 |
| పోలయ వేమారెడ్డి వృత్తాంతము ... ... | 60-61 |
| అనపోత వేమారెడ్డి కథ ... ... | 62 |
| సిద్ధునికథ ... ... ... | 62-63 |
| సిద్ధుని గోపకుం డగ్నింద్రోయుట ... ... | 63-64 |
| గొల్లడు సువర్ణవిగ్రహమునుఁ జూచుట ... ... | 64 |
| ప్రభువు సువర్ణవిగ్రహమునుగూర్చి విచారించుట ... | 65-66 |
| అన వేమారెడ్డికథ ... ... ... | 66-68 |
| కామగిరి వేమారెడ్డి వృత్తాంతము ... ... | 68-69 |
| కోమటి వేమారెడ్డికథ ... ... | 70 |
| శ్రీనాథుడు విద్యానగరమునకుఁజనుట ... ... | 70-71 |

| | | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| ప్రభువు గృహరాజు మేడ విషయమై సభికులనడుగుట | | ... | 72 |
| ప్రభువునకు శ్రీనాధుడు గృహరాజు మేడసంగతి చెప్పుట | | ... | 73 |
| కొండవీటి గృహరాజు మేడ వృత్తాంతము | ... | ... | 73-75 |
| గృహరాజు మేడవర్ణనము | ... | ... | 75-79 |
| హోర్కారులు రాయలకు కొండవీటిమేడ వృత్తాంతముఁ జెప్పుట | | ... | 80 |
| రాచ వేమారెడ్డి చరిత్రము | ... | ... | 81-82 |
| ఆరుగురురెడ్ల కాలనిర్ణయము | ... | ... | 82-83 |


## తృతీయాశ్వాసము.


| | | | |
|---|---|---|---|
| లాంగూలగజపతి కొండవీడు ప్రవేశించుట... | | ... | 85-86 |
| కపిలేశ్వర గజపతికథ ... | ... | ... | 87 |
| పురుషోత్తమ గజపతికథ | ... | ... | 87-88 |
| ప్రతాపరుద్ర గజపతికథ | ... | .. | 89 |
| కృష్ణదేవరాయల వృత్తాంతము | ... | ... | 90 |
| గాండ్లసంగయను స్త్రీ వర్ణన | ... | ... | 91 |
| కృష్ణరాయలు గాండ్లసంగను మోహించుట | | ... | 91-92 |
| పడకటింటివర్ణన ... | ... | ... | 92-93 |
| కృష్ణరాయలు తూర్పుదేశముపై దండెత్తుట | | ... | 94-96 |
| కొండవీటియుద్ధము ... | ... | ... | 96-99 |
| సూర్యాస్తమయ వర్ణన ... | ... | ... | 100 |
| వీరభద్ర గజపతి రాయలతో సంధి జేసికొనుట | | ... | 100-101 |
| చంద్రోదయ వర్ణన ... | ... | ... | 101 |
| ప్రాతఃకాలవర్ణన ... | ... | ... | 102-103 |
| కృష్ణదేవరాయలు కొండవీడునుండి దండువెడలుట | | ... | 104 |
| కృష్ణదేవరాయలు గజపతికొమార్తెను దెచ్చుట | | ... | 105 |
| నాదెండ్ల గోపమంత్రి ప్రభుత్వవిషయము, శాసనములు | | ... | 106-112 |
| అచ్యుతదేవరాయలకథ ... | ... | ... | 112 |
| గోపినాధపురవర్ణన ... | ... | ... | 113 |
| గోపినాధస్వామి ఆలయవర్ణన | ... | ... | 114 |
| పాలెగాండ్రను చీకటి కోనేటఁద్రోయుట | | ... | 115 |

పుటసంఖ్య.

సదాశివదేవరాయలకథ ... ... 116-119

## చతుర్థాశ్వాసము.

తురకలు రామరాజును యుద్ధమునఁజంపుట ... 121-122
తిరుమలదేవరాయుడు తురష్కులఁ గెలుచుట ... 122
శ్రీరంగరాయలకథ ... ... 123-124
రాయరావు కొండవీటిదేశముపై దండెత్తివచ్చుట ... 124-126
కొండవీటిదుర్గము రాయరావు స్వాధీనంబగుట ... 126-128
తిరిగి రాయరావు హైదరాబాదేగుట ... ... 128
పదునాలుగు సముతుల క్రమము ... ... 129
అమీనుముల్కు కథ ... ... 130
శిఖివసుఖానుడు ప్రభువై వచ్చుట ... ... 131-132
మిరియాలచట్టుపై బురుజుగట్టుట ... ... 133
నాజర్ జంగు కొండవీటిదేశము ఫ్రాన్సువారికిచ్చుట ... 134
కొండవీటిసీమ మరల తురష్కులకువచ్చుట ... 13
కొండవీటిసీమ కంపెనీవారికి వచ్చుట ... ... 1
ఫలశ్రుతి, గ్రంథసంపూర్తి పద్యము ... ... 1

శ్రీరస్తు.

శ్రీమత్కోదండరామాయనమః.

# శ్రీకొండవీటిచరిత్రము

## ప్రథమాశ్వాసము.



శ్రీపద్మాంశజయైన భూమితనయన్ జిహ్మాద్రికాలక్ష్యసం
ధానాణిన్ శిరమందుఁజేర్చి విలస త్తత్త్వంబుబోధించుమే
ధాపూతక్రియఁగొండవీటి విభుగా ధల్ సెల్వగాఁబూనుస
ద్భావున్ భక్తినుతించెదన్ శ్రుతికుభృత్కోదండరామప్రభున్.

### శివస్తుతి.

మ. స్తుతియింతున్ నిజపాదపద్మయుగళ స్తోత్రప్రసంగాభినం
గతహృత్ప్రీత సుపర్వపారిషదను ఖ్యస్వీయభక్తాగ్ర్యస
న్నుతయోగాఢ్యసగేంద్రజాహృదయప ద్మారామసీమార్యమున్
సతతప్రాంచద భంగమౌళితలభా స్వత్సోమునిన్ సోమునిన్. 2

### బ్రహ్మస్తుతి.

మ. నలుమోముల్ శ్రుతినాదసంకలిత వి జ్ఞానస్వరూపంబులై
పొలుపొందన్ సురరాజకాగసువిధుల్ బోధింపుచున్ బంకజా
తలసత్పీఠి సరస్వతీయువతిఁజే తఃప్రీతితోఁగూడిని
స్తులలోకాళిసృజించు పద్మజు నుతిం తున్ భక్తినశ్రాంతమున్. 3

### లక్ష్మీస్తుతి.

చ. కొలచెదఁ జిల్కపల్కులనుఁ గుల్కుల బల్కులనాధు సెజ్జపైఁ
గలసిరహాస్యవర్తనలఁ గౌఁగిలినానుచు నొక్క సంశయుం

బలనిడఁబన్నయైనతను నాస్తఁగనుంగొన వైరమంచునీ
వలపలికన్నుమూయుమని వారిజనాభుని వేడునిందిరన్. 4

పార్వతిస్తుతి.

సీ. నతితసంరక్షిత సాధుభక్తకదంబ శోభితానల్పతే జోవిడంబ
చిరతవామాంకసం దీపితహేరంబదితిజాతహనన ప్రథితకదంబ
అబ్జజాండస్థలో కాళిమూలస్తంబ స్మరకేళికాపరి స్ఫురితసాంబ
సైకతవేదికాసదృశచారునితంబ అధరాధరితసుధామధురబింబ.
తే-గీ. మందహాసవిలాసాస్య నిందమాన
సుందరానందకందళి తేందుబింబ
శంబరారాతిభిన్మన స్సారసావ
లంబలోలంబ శ్రీజగ దంబఁగొలుతు. 5

సరస్వతిస్తుతి.

చ. తనపతిచెంతఁజేరి విత తప్రమదప్రదమావిపంచికా
స్వనమలరారరాగముల సస్వరయుక్తిఁబఠించి మూర్ఛనా
కనదురుశబ్దగౌరవము గన్పడమేలములన్ బొదల్చునా
వనరుహయోని రాణిశుక వాణిపురాణి భజింతునిచ్చలున్.

విఘ్నేశ్వరస్తుతి, త్రిప్రాసము.

మ. గణనాథున్ మదగంధలుబ్ధమధుపా క్రాంతేభరాడ్వక్త్రుఁగో
గణనాథాశ్వితనూజున ప్రతిమ వి ఘ్నధ్వాంతభానున్ మరు
ద్గణనాథార్చిత పాదపీఠుశ్రుతివి ద్యావేదితున్ వాతభు
గ్గణనాథ ప్రథితోపవీతుఁగొలుతున్ గళ్యాణగర్భస్తుతున్. 7

హనుమస్తుతి.

సీ. తనశైశవహరిత్వమునకలయరుణబింబంబొకయరుణబింబంబుగాఁగ
తనమహాబలగుణో ద్ధతికలతరణి మార్గంబొకతరణి మార్గంబుగాఁగ
తనఘనవిస్రంభమునకల సురసజసంభణమొకసురసజృంభణముగాఁగ
తనవచోమృతవర్షమునకలరామమానసమొకరామమానసముగాఁగ
తే-గీ. వనమకరుణాసుధారస ప్రసరమస్మృణ

భసల నిరసనసుందరో ల్లసితనయన
విస్ఫురత్కటాక్షములు నలు దెసలఁబర్వ
శ్రితతతులఁబ్రోచు హనుమంతు నతినుతింతు. 8

శంకరాచార్యస్తుతి.

శా. విద్వద్వందితుఁడై కృతార్థకృతసం విత్సూత్రభాష్యాదిసం
పద్విభ్రాజితమానసుం డఖిలస న్మాన్యప్రభావాధికుం
డద్వైతార్ణవపూర్ణిమామృతకరుం డై యొప్పు శర్వాంశజాం
చద్వేషున్ భజియింతు నిచ్చలు మదిన్ శ్రీశంకరున్ శంకరున్. 9

గురుస్తుతి.

ఉ. వేమరుభక్తిఁగొల్చెదఁ బవిత్రచరిత్రుసుపాత్రుమద్గురు
స్వామినితత్త్వమార్గవి చారపరాయణు సూక్తికారణున్
తామసచిత్తమోహఘన తామసభేదసరోజమిత్రు దా
ర్వేములపావనాన్వయస రిత్పతిచంద్రుని లక్ష్మణేంద్రునిన్. 10

సంస్కృతకవిస్తుతి.

పంచపాదిసీసము, క్రమాలంకారము.

సీ. ఎవనివాక్ప్రౌఢిమం బెఱిఁగించె సుందరా శ్రీరామకథలెల్ల తీరుగాఁగ
నెవనివాగ్వ్యాప్తి చెన్నెఱిఁగించ శ్రుతిశబ్ద బీజాళికంకుర ప్రాజిగాఁగ
నెవనివాఙ్మధురిమ యెఱిఁగించె రఘువీరునకు నవవ్యాకరణజ్ఞుగాఁగ
నెవనిదివ్యకవిత్వ మెఱిఁగించె నాటకఘటనాపటుత్వము ప్రకటముగను
నెవనివిద్యాపణం బెఱిఁగించె భువనేశ్వరినిత్వమే వాహ మంచనుటగాఁగ.
తే-గీ. నెవనికృతికలి నుడిపెను నుత్కృష్టిఁగాఁగ
నెవనినుతిఁ జేసె మిహిరుని హితునిగాఁగ
జోకఁదక్కవులనుతింతు నాకుభవుని
వ్యాసు, హనుమంతు భవభూతి ననఘు కాళి
దాసు శ్రీహర్షుని మయూరు తత్వధీరు. 11

ఆంధ్రకవిస్తుతి.

సీ. వాగనుశాసను వాగ్విలాసముఁ గుండలీంద్రుగూఢపదని స్తంద్రవైభ

నముఁ బ్రబంధపరమేశ్వరు ప్రసాదత్వము సోముకళావాప్తి భీముపాటి
గుణము భాస్కరుకాంతి గుప్తియు శ్రీనాథకవిరసపోషణ గణుతిసహజ
పాండిత్యకవివర్య భావప్రాప్తిమలయమారుతుని మాధుర్యశైత్యత
తే.గీ. పరపువేంకటపతియర్థ బలము పెద్ద [యుగణాప.
నార్యునౌదార్యతయుఁ దాత యార్యసుకవి
హానవృష్టియుఁ గాకునూ ర్యప్పకవి వి
శేషలక్షణవృత్తసు స్థితినుతింతు. 12

కర్తృవిజ్ఞప్తి.

క. కరయఁ దక్షిండంబుల, దారచి తేజమిడుపార దముక్రియనస్మ
త్కారితమగునీకబ్బము, ధీరులు గరువమునగనను తింతునుభక్తిన్. 13

సుకవినుతి.

క. భూమిం బండితవరులను, పామరులుగఁ బామరులనుఁ బండితులుంగా
నేమింపుచునాత్మస్తుతి, కామముపరనిందసేయు ఘనులనుతింతున్. 14
వ. అని యిష్టదేవతావందనంబును, సుకవినికర నమస్కృతియును, సర్వ
సుజన విజ్ఞప్తియును, కుకవినుతియును, గావించిమదియాన్వయ ప్రభు
తావిశేషాభివర్ణ నాయత్తచిత్తంబున నస్మద్వంశ ప్రశంసమొనర్చ
యించెద. 15

కర్తృవంశావతారము.

ఉ. శ్రీమహిత ప్రభావమునఁ జిన్మయుఁడై జగదేకరక్షణా
సేమగుణాభిరాముఁడయి క్షీరపయోధివసించి దేవచిం
తామణియై చరాచరవి తానమయాకృతి గాంచిమించునా
స్వామిసునాభికంజమున స్రష్టసముద్భవమొందె బొందుగన్. 16
క. ఆపద్మజముఖమునను, ద్వాపరులువిమలమతులు బ్రహ్మఋషుల్ ని
ర్లేపకులతిలకపోని, స్థాపరులుద్భవిలిరధిక సాత్వికులగుచున్. 17
ఉ. ధన్యచరిత్రులై పరగు దద్ఋషిపుంగవులందు దేవతా
మాన్యుఁడు దివ్యయోగబల మండిత పండిత వందితుఁడు కాం
తిన్యుఁడ ఖండతేజుఁడు తృ ణీకృతకిల్బిషుడై మహాతపః

ద్వైనపిచ్చమను ద్వాహామై చెలంగి
సుతులఁగ నెముప్పురఘునయ శోభరితుల. 25

వ. వారెవరన. 26

చ. నిరుపమసత్యశీలుడతి నిర్మలమానసుడంగజాతసుం
దర పురుషాగ్రగణ్యుఁడుఁ శ్రితభ్రమరాంబురుహుండు జ్ఞాన వి
స్తరణుఁడు వేంకటేశ్వరపద స్తుతిపాత్రహృదంతరుండు వా
క్సరసుఁడు వేంకటప్పయరసజ్ఞుఁడనర్ఘ జెలువొందె ధారుణిన్. 27

క. సన్నియత మానసుఁడు బుధ, సన్నుతశీలుండు బ్రహ్మచర్యాశ్రమసం
పన్నుండు రక్షితనతా, పన్నుఁడు రఘుపతి జెలంగె బ్రహ్మణ్యుండై. 28

సీ. తనమృదుకవితావిధానంబు సుప్రబంధానీకరత్నాకరంబు
తన దానధారావితానంబు యాచకచాతకాంబుదముక్త జలకణా
తన మోహనాంగసౌందర్యంబు విరహిణీయో
షాచకోర చంద్రోదయంబు
తనభూనభోంతరే ద్దయశోవిశేషణంబష్టదిక్కామినీ హారసమితి

తే. గాఁగఁ జెలువొందె నిజకావ్య కల్పనాతి
శయవదాన్యబహూకృత శస్త్రవస్త్ర
భూషణాలంక్రియాదివి విశేషణుండు
అనుపముండు వేంకటసుబ్బయార్యుండు. 29

సీ. అందగ్రజుఁడు వేంకటప్పయార్యవరేణ్యుడధిక పాండిత్యుడై యతిశయిల్లి
కుమనుపరోపకారములొనర్పగగృహస్థాశ్రమమతిశయ మాకతము
దార్వేములాన్వయోదధిపూర్ణ చంద్రుడౌ
నప్పయార్యతనూజయై జెలంగు
పరమపతివ్రతా తరుణిసరస్వతమ్మనుగొని విభవసంపన్నుడగుచు

తే.గీ. రఘుపతి సుధీశుననుగురు బ్రహ్మనామ
ధేయధరుసుబ్బరాములశ్రీయుతలగు
సుతలనిర్వుర వేంకట సుబ్బమాంబ
లలిత గుణ వేంకటహనుమాంబలనుగాంచె.



తే-గీ. మత్కనిష్టపితృండుధీ | మంతుడనఁగ
వెలయువేంకటసుబ్బయ | విభుడుకూర్మి
సుందరమంబత్నిగాఁగాని | సుఖవిశేషు
డగుచుననుస్వీకృతకుమారు | నిగ్రహించె. 3

వ. ఇట్లొప్పుచు భగవత్కృపాతిశయంబున దినదిన ప్రవర్ధమానుండనై యుండుటయు. 32

శా. శుండాలావనపాదపద్మనత దీ | క్షుండార్యసంభావనా
ఖండుండై తగుపోతరాజకులుఁడౌ | కామేశ్వరాఖ్యుండు శ్రీల్
నిండన్ సత్వగుణప్రధానుఁడగుచున్ | వేమూరివంశాబ్ధిచం
ద్రుండౌ వేంకటసుబ్బయాఖ్యసచివుం | డున్మిత్రులై యొప్పెడున్. 33

క. క్షీరమునీరమునంగల, కూరిమిరాయంచ చేతఁ గోల్పోఁడగిని
స్సారమగుఁగాని మాని, స్సారహితోన్నతిఁ గదల్పఁ దరమా నెభువిన్. 34

సీ. నిత్యనైమిత్తిక | కృత్యముల్ దీరిచి దేవగోబ్రాహ్మణ | సేవఁజేసి
కొంతవట్టుపురాణ | గోష్ఠిఁగాలముపుచ్చి మధ్యాహ్నికముల | సమ్మతినొనర్చి
విన్నకొండపురిని | విలసిల్లుతాలూకు సభకులౌకికకార్య | సరణికేగి
సాయంతనంబున | సరససంగీతప్రసంగసంగతి ప్రభం | జనతనూజు

తే. గీ. భవనమునఁజేరి యచ్చటఁ | బ్రబలభక్తి
యుక్తిసాహిత్యగాన ప్రక్రియుక్ప్రబంధ
బంధురములగు భజనలు | బఱపియెల్ల
కాలయీరీతివేడ్కల | గడుపుచుండ. 35

సీ. ధాత రెండవపరా | ర్ధమునందు శ్వేతవరాహకల్పాహ్వ | యాభిరామసమయ
మహితవైవస్వత | మన్వంతరంబునకలియుగాదిమపాద | కాలకలిత
చాంద్రమానంబున | శాలివాహనశకాబ్దంబులశశినేత్ర | వసుమృగాంక
సంఖ్యలగుల (1821) వికారి | సంవత్సరంబున నుత్తరాయనమున | నొప్పు

తే-గీ. ఋతువునను జ్యేష్ఠమాసంబు | కృష్ణపక్ష [గ్రీష్మ.
మునదశమి భాస్కరునివార | మునను భరణి
సాధనాఖ్యతారనుగ | ర్కసాక్షిపక్ష

మాద్రికేగెడుశుభసమ । యంబునందు. 36

క. వారలఁగూడిమనోజ్ఞ వి,హారంబుగఁగొంతదూర।మరుగుదుమని వి
స్తారసరసప్రశంసలు, దేరఁగఁగుతుకమునఁబయలు।దేరగ మాలోన్.37

ఉ. ధీవరులార కొంతమతి । దేరఁపి కారికిఁబోదమయ్యయా
నావరుణాశ కేగనట । నర్కుఁడు గ్రుంకు నవాచి కేగరో
షావృత శార్ఙ్గదేవుదెస । జక్కులరాదె సయేకపింగళా
ఖ్యావనదక్షుమాటనిటు । గాదటుగాదటుగాదుప్రాచికై. 38

వ. అని యనేకప్రకారంబుల విహితవాక్యంబులం దర్కింపు కొనుచుఁ బ్రాగ్భాగంబునకరుగందలంచితద్రాజమార్గంబునంజనుచుండ వారలంగాంచి నేనతికుతుక కలితమతినై కవితాప్రశంస భాషణోల్లాసమానసుండనై

చ. హరిమయమై సెలంగుజగ । మజ్జగమందున గల్గుమానవో
త్కరమున కెల్లముక్తిఫల । దంబగుదివ్యపథంబు శ్రీశునో
హరుభజనానుకీర్తనము । యాహరికీర్తన కాలవాలమై
పరగుఁ గవిత్వమాకవిత । పాపవిమోచన మెల్లభంగులన్. 40

క. దివ్యతరసుఖనిధానం, బవ్యయసంపత్ప్రదాయి । యఖిలవిబుధసం
సేవ్యమువిశ్వశ్రేయః, కావ్యమ్మని శ్రుతులుబల్కు । గాభువివినమే. 41

చ. మహిఁగలసప్తసంతతుల । మానితమైసకలార్థదాతయై
బహుళయశోవిశాలమయి । పాపనివారణ కారణంబునై
యిహపరసాధనంబులకు । నిమ్ముగుచున్ నరునెల్లడన్ మహా
మహునిగ సేయునట్టిఘన । మార్గము కావ్యమెయెన్ని భంగులన్. 42

క. అనిమనవిసేయ వారలు, విని పరమానంద కలిత । విశదాత్ముకులై
ననుఁగాంచిబల్కిరీవిధ,మునసతిమృదుమధురవాక్య । ములనాతోడన్.

ఉ. మాపతిప్రాపులేకఁదర । మా? పరమాదరమానసాంచితుం
డై పటుశబ్దభావరచ । నావచనాతతసత్కృతిన్విని
క్షేపమటంచునెంచిధృతి । చేమతి చెర్చి యొనర్చి రేని స
త్తాపరతంత్రతకృద్రసప । దాస్పదమాఁగదకబ్బమల్లినన్.

వ. అనిబల్కిన నేనునుసంతసింపుచు.

తే-గీ. కవితరెండు తెఱంగులై క్రాలుచుండు
నిలనుసంగీతసాహిత్య ములననందు
నఖిలజనహృద్యమవ్యయ మధికమగుచు
సాహితీకృతివరలుని స్తంద్రగతిని. 46

వ. ఎట్లనిన.

మ. మునుసాహిత్య నిదానగాన ఘనస మ్మోదజ్ఞ సంప్రోత కా
వ్యనికాయంబుల సాహితీకృతులువిఖ్యాతంబుయొప్పంధా
త్రినిసంగీత లసత్ప్రబంధములుత్కృ ష్టింగూర్ప వెం తేనిఁగా
వునసాహిత్యముకో విదాభరణమై పొల్పొందు లోకత్రయిన్. 47

క. మతినిట్లు దలచుచునుదిన,వ్యతరంబుగ శరధిశయను డగుశ్రీహరికం
కితముగనునాంధ్రసంస్కృత, యుతకృతిబహుమతిగఁ జేయ నుద్యు
క్తుఁడనై. 48

వ. ఉన్న వాఁడఁగాన. 49

ఉ. సర్వజనానుకూలనుఘ సంహరణంబుఁద్రిలోకపావనా
ఖర్వబలోర్వరా రమణ కారణసచ్చరితప్రకాశమున్
దుర్వహవర్ణ నానిచయ తోషము కేశవ విస్ఫురత్కథా
దూర్వహకావ్యకల్పనము దోడ్పడురీతి నెఱుంగఁ దెల్పుఁడీ. 50

తే-గీ. అనుటయును దరహాసనాస్యు లగుచుయుష్మ
దభిమతముజ న్మపావన మదిఘటిల్లు
పథమెఱింగింతు మిపుడుస ద్భావ్యనీవు
ప్రకటమద్దులపలిగురు బ్రహ్మనామ. 51

సీ. మున్నుత్రేతాయుగ మునభీమముఖ పాలి
తంబై విదర్భాపురంబనంగ
పొలుపొందిదమయంతి పుట్టువుచోటయి
ద్వాపారమునభీష్మ భూపముఖుల
చేఁబ్రోవఁబడి[illegible]ర్తి చెన్నొందికుండిన
మను పేర విభవవిఖ్యాతమగుచు

కృష్ణుండు చైద్యులం గెడపి భీష్మకపుత్రిం
గై కొన్న స్థలమయి కలియుగమున
చతురంగబల సమన్వితులగు వివిధభూ
ధవులచేతను బ్రభుత్వంబు వడసి.

తే-గీ. మలయ వింధ్యాద్రిమధ్యభూమండలమున
దనరు రాష్ట్రంబులకు రాజధానియగుచు
విపులతరభూతిచేఁ గొండవీడనంగ
బరిడవిల్లను నొకదివ్య పురవరంబు. 52

క. ఆపురవరమేలినధర, ణీపులచరితములు కాల నిర్ణయములు సం
దీపింపఁ జేయుకబ్బము, జూపట్టను వచనరూప శుభగంబగుచున్. 53

సీ. ఏరసికులకులసారసాటవి సూర్యుఁడనఁగ శ్రీభాస్కరుండాదియౌ వ్య
నేకధీరవరులదానాధార కరశాఖల లఘుద్విజాళికి ఫలములొసఁగ
నే ప్రాజ్ఞవరులమంత్రప్రభావార్కచే నరితమోదళనుఁడై యధిపుడలరె
నేకోవిదులసుమనోకౌశలతవ శీకృతమాచుమాధుక రతతిరియొప్పె

తే-గీ. నట్టిభవ్యులుతిమ్మాపురాగ్రహార
పతులు నందవరీకులు భాస్కరుని స
దన్వయజులు శీతారామ యాహ్వయుండు
రాజితయశుండు గోపాల రాయఘనుఁడు. 54

పంచపాది.

తే-గీ. వారలత్యంత కృపచెలు వారదీని
నొసగిపద్యప్రబంధమై యొసగునట్లు
సేయుటొప్పనుటయునట్లు సేయుధీరు
నరయఁగఁ దలంపదొరకితి యవసరమున
వెదకులతపాదముల్ దాకు విధముతోప. 55

చ. చిరతరసత్కవుల్ మునురచించిన కావ్యములన్ జరిత్రముల్
బరపిరి కాని కాలగతి వ్రాయమివాని నెఱుంగనెందు దు
స్తరమికఁ గొండవీటిచరితంబను కబ్బము కాలసంఖ్య భా

సురసుగునట్లుగూర్చి మధుసూదనునకంకితమియ్యఁగాఁదగున్. 56

వ. అని యిట్లనేకవిధంబుల సునీతివాక్యంబుల నుపన్యసింపుచుఁ దద్గ్రం
థంబు నొసంగిన నేనును నమందానందకందళితాంతరంగుండనై మదీ
య జన్మసాఫల్యప్రదంబని దలంపుచు తత్ప్రబంధ సృజనాభిలాషచే
నానందాద్భుతంబులు మనంబునఁ బెనఁగొన శ్రీయుతికిఁ బ్రణామపూ
ర్వకంబుగా పునః పునః ప్రణామంబు లాచరింపుచు సమస్త మిత్ర
రత్నంబు లిరుగడలనరు దేరనే తత్కృతినాథ సందర్శనోత్సాహంబున
నాతని మందిరంబునకుం జన నుద్యమింపుచు సకలవస్తు సంతానంబు
లంబూని బయలు వెడలి. 57

సీ. చతురర్ణవాన్వితాశేషతతమహీమండలాంచితమేరుగిర్యవాచీదిశాస్థ
కావేరికృష్ణాపగాద్వయాంతరగత ప్రస్తుతయామ్యనాభిశస్తదేశ
మునఁద్రిలింగక్షేత్రమున శ్రీగిరీశాన్య దిశఁగొండవీటిప్రతీచీభాగ
భూమిఁజేజెర్లకపోతేశ్వరస్థలా స్తోకదక్షిణాపరకోణిబొసఁగు

తే-గీ. గుండికానిమ్నగోత్తరగోత్రనొక్క
కోసుదవ్వునఁజెన్నొందుకమలధరంబు
జలజవిలసితకాసారసంయుతంబు
కిల్బిషహరంబు శ్రీశ్రుతగిరివరంబు. 58

చ. మునుహరిరాముఁడై విపినముల్ చరియింపు నెడన్ దశాన
నుఁడటు చోరుఁడై కొనిచనన్ దిగులొంది మహాటవుల్ గనం
గొని తనపత్నిగానకను గుందుచువార్త జటాయువున్ వినీ
ఘనగిరిఁజెప్పగావినినకారణతన్ ద్రిజగత్ప్రథితంబుగన్. 59

క. శ్రీశ్రుతశైలంబనభువి, విశ్రుతనిఖిలాగమాంతవేత్తృపరమహా
సాశ్రమయుతఋషిబృందకృ, తాశ్రమమై పరిఢవిల్లునభ్రంకషమై.

వ. మఱియును తెలుంగునవిన్న కొండనాగసర్వజనవినుతంబై మున్ను
రాఘవుండు దశగ్రీవుండు నిమి సీతామహాదేవింగొని పుష్పకారూ
ఢుండై సానుజబంధుమిత్ర పురోహిత ప్రముఖుండై నిజపురంబున
కరుదేరుచు తద్దశానన హనన ప్రతిపాదకంబగు బ్రహ్మహత్యాపహారం

బుగ సేతుప్రభృతి అయోధ్యాపర్యంతంబు శివప్రతిష్ఠ లొనరింపుచు
నిక్కధరంబున సీతా రామలక్ష్మణ భరతశత్రుఘ్న నామంబుల న
నామంబులగు విమలకమల కమలవిలసిత కాసారంబుల సృజిం
యచట శ్రీరామలింగాభిధానంబున నొక్కలింగంబును ప్రతిష్ఠించు
కతంబున నీశైలం బతిపవిత్రంబై మహనీయ నివాసయోగ్యంబై
కైలాసంబు ననుకరించియుండె నత్కుధర ప్రాంతంబునందు. 6

శ్రుతగిరిపురవర్ణనము క్రమాలంకారం.

సీ. బడబానలంబునకేభంగంబుగాకున్న నీరధిసమతవర్ణింపవచ్చు
ద్వారబంధురమౌచుండదనరినచోఁ జక్రవాళంబెనయనిబోల్పంగవచ్చు
శిలల చేనందంబు సెడకయుండినరౌప్య కనకాగములనెనయంగవచ్చు
అనలాహుతముగాకయలరినచోఖాండవంబుతుల్యంబనిపల్కవచ్చు
తే.గీ. వనఁ దనరుపరిఘావరణాలయోప
వనయుతంబలకాపురవైభవంబు
సకలపండితపాండితీప్రకటితంబు
సురుచిరజనంబు శ్రుతగిరిపురవరంబు.

వ. ఇట్లు విలసిల్లుచు భువనైకవిరాజమానా పూర్వదేవప్రతిష్ఠాపనంబు
యనర్గళదుర్గ మదుర్గాభిరక్షితంబును మరుత్తనయ పాలితాష్ట దిగ్బ
బంధురంబును త్రిశూలి వాలావాల విశాలసాల పరివృతంబును
యని భాస్కరామాత్య ప్రముఖ దేశముఖ పరిపాలితంబును అఖి
మహీమండల మండనాహీనైశ్వర్యనిధానంబును నై యొప్పునప్పురం
నివాసయోగ్యంబుగానెంచి యందఘటిత ఘటనాచాతురీ ధురీణుండై
యింద్రనీల ఖచిత సోపాన మౌక్తిక మాలాలంకృత ద్వారబంధ
చంద్రకాంతాస్థగితకుడ్య మరకత ఖచితకుట్టిమ పుష్యరాగవితర్థికా
ధిక సుందరంబగు మందిరంబున సమందానందంబున సీతాలక్ష్మ
లిరుగెలంకులం గొలువ దక్షిణాభిముఖుండై యనర్ఘ్య మణిబాస-
నంబగు దివ్యసింహాసనంబున నిండోలగంబుండు పుండరీకాక్షునకు
ప్రణామంబు లొనర్చుచునే తద్వృత్తాంతము నద్దేవునకు మనవియొ

రించి గురు పురోహిత విద్వన్ముఖులచే నాజ్ఞగైకొని శ్రీనుతకొండ వీటిచరిత్రనామక ప్రశస్తంబగు కావ్యంబు గద్యపద్యరూపకంబున నాశ్వాసచతుష్టయంబున శాలివాహన శకవర్ష మాసాది కాలనిర్ణయంబులు దీపింప పాపవిమోచనంబుగా నొనరింపఁ గృతప్రారంభుండనై.

షష్ఠ్యంతములు.

క. ఏతాదృగ్విపులయశో, పేతునకున్నిఖిల దితిజకృధులవనీని
ర్ధాతకృతవీతిహోత్రున, కాతతధరణీసుతాసుఖాకృత్తాత్మునకున్. 64

క. దాతకుసకలాగమ ని, ర్మాతకు నిజభక్తబృంద రాజత్సుఖసం
ధాతకు సమస్తలోక, త్రాతకు నేతకు విధాతృ తాతకుహరికిన్. 65

క. పుణ్యాజనని కరనిరత శ, రణ్యాల సన్మృదులపాద రాజీవునకున్
పుణ్యాజన వీరవం శా, రణ్యకుఠారునకు భూమి రామాపతికిన్. 66

ఏకసమాసం.

క. స్రష్టృఘునాయున కేశవి, శిష్టామర దైత్యమాని శిష్టధ్యేయో
త్కృష్టప్రభావ సంభరి, తాష్టాక్షర మంత్రమంది రాంతస్థునకున్.

చతుష్పాత్ప్రకందము.

క. వననిలయ మానిజనతా, వననిలయాయ తదయాప్ర వాహోదధికిన్
వననిలయమకరహారునకు,వననిలయమృగేంద్రమనుజవపు నాత్మునకున్.

క. శ్రుతభూభృత్పురమధ్య, స్థితఘనతర చక్రపాణి శ్రీనాగేశాం
చితభర్మ నివేశా నా, రతయుత కోదండరామ రాజేంద్రునకున్.69

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన దురితలతాలవిత్రంబగు కొండ వీటిచరిత్రంబునకు కథావిధానం బెట్టిదనిన. 70

కథాప్రారంభము.

ఇంద్రుడు నారదునితో కథాప్రస్తావన సేయుట.

సీ. వదనాంబురుహమధు పానసమాయత చంచరీకారావసంభ్రమంబు
ఓష్టపల్లవదంశ నోద్యుక్తకోకిలా క్రాంతప్రియోక్తిత సమ్మతంబుఁ
ఘనబాహు బిసలతాగ్ర సనధావన పరివృతరాజహంసప్రవేశనంబుఁ
పాదసమ్మిళితరావ్యవికారమంజీరఫణివిభ్రమోచ్చలద్భృహ్మిణంబు

తే-గీ. నవసుఖ శ్రుతిగీతాభి నయమునర్తి
నయుత సమగతి వీణాది నాదపణవ
శబ్దగతతాళ గాణిక్య సరసగాన
శస్త రంభాదికంబగు శక్రుసభను. 71

సీ. ఒకముఖంబునభటప్రకరంబతిస్ఫుటప్రాగల్భ్యతఁబరాకుబలుకుచుండ
నొకయోరసముదార హుంకారకరధీరశూరులుబారులుతీరియుండ
నొకమ్రోలరసమేళనకవీంద్రులతిసాంద్రవివిధవిద్యాగోష్ఠిదవిలియుండ
నొకచెంతవేదాంత సుకరాంతరాత్మగ
స్వాంతయోగులుతత్త్వ మరయుచుండ

తే-గీ. నిరుగడలఁ జామరమ్ముల చ్చరలువీవ
నందితానంద మౌనీంద్ర బృందములును
దివ్యయజ్ఞాదికములు మూర్తీ భవించి
కొలువగ హరిపులోమజా కలితుఁడగుచు. 7

మ. జ్వలదుత్తుంగసువర్ణనిర్మితమణీ సంప్రోతసింహాసనా
భిలసన్మస్తకవజ్ర కీలితరుచి ప్రేంఖత్కిరీటాగ్ర్యని
స్తులతేజం బెసగంగ నిండుకొలువై స్తుత్యస్థితిం గాలుచోఁ
గలహాశుండగు నారదుండపుడు రాగా వారితో నిట్లనున్. 7

ఉ. ఓమునివర్య తావకమృదూక్తిసుధారస ధారలన్ శ్రవ
స్సీమలనింపఁ గోరిమిముఁ జేరితిధన్యుఁడనైతిగాన నీ
భూమినిఁగొండపీటిపుర భూపతివర్యులసచ్చరిత్రముల్
ప్రేమదలిర్పగా వినవలెంజెపుమాయ సమానవైఖరిన్. 7

చ. అని కడుగారవంబెసగ నన్నఁబసన్నతఁ దోపనారదుం
డనియె మహేంద్రుతో నిటుల నంతవచింతును పూసగూర్చగా
వినుముమహాత్మ సత్యమది వీనులవిందుగ నంద మొందనా
వనదశరీర కేశవకృ పారస పూరపయస్సమృద్ధిచేన్.

చ. కలుగునుసర్వసస్యచయ కారణ నీలశరీరధారి సిం
ధులలిత మానితాంశుకమ నోహరకారిగిరి స్తనస్థలా

కలితవిహారిలోకభృదనేకకల్మషసచ్ఛరితప్రచారిభూ
లలనచెలంగుఁ గూర్మచటులద్విపఘోణిఫణిప్రసారియై. 76

తే-గీ. అట్టి భూదేవతాకుచాభ్యంతరాభి
లాలితనిచోళవత్కుః ప్రకలంబమాన
వితతముక్తాసరోమధ్యపతకనాయ
కమణియనభరతాభిఖ్యకండ మొప్పు. 77

చ. కలదచటర్ణదురంతరిపుకంధరబంధనరాజపక్రమో
జ్వలకరపాశముఁ గనకలజంతుసుఖప్రదకుంజపుష్పకు
ట్మలఫలపల్లవచ్ఛదనమానితభూజనసీప్రదేశముఁ
జలధిసుతానివేశనముసమ్మతధర్మవిదగ్ధ్యదేశముం. 78

కుండినవర్ణన.

సీ. శ్రీశైలకాళహస్తిశ్రీదాక్షారామనామకంబులఁ బ్రశస్తిమెలంగు
లింగత్రయీమధ్యరంగమహీస్థలస్థితమైతగు తెనుఁగుదేశమందు
కృష్ణాస్రవంతిదక్షిణమున యోజనత్రితయావధిస్థమై చెన్ను మిగులు
గుంటూరునకు బుత్తరక్షోణిభాగమునను కోటినదిపుణ్యవాసినగడు

తే-గీ. విన్నకొండకుఁ బ్రాగ్దిశనున్నతముగ [ఉ
యోజనచతుష్టయంబున నొప్పుచుండు
నఖిలజంతునివాసగహనయుతంబు
సుంధరనిభంబు కుండిన మహీధరంబు. 79

క. ఆకుధరంబాకాశము, దాఁకగఁ బెరుఁగుటను గిరివిదారుని కాక్రీ
డాకృతిఁ దాల్చెడునదియు, స్తోకచ్ఛాయ చటులకూటశోభాభృతమై. 80

శ్లేష.

వ. మఱియు నక్కుధరంబు సముత్తుంగభృగుభంగసంగతంబగుట మక
రాలయంబును అనిమిషనికాయ్య పరిశోభితంబగుట నాకంబును బహు
శద్విజసమాకీర్ణంబగుట యజనవాటంబును మృగాభిరామంబగుటఁ జం
ద్రమండలంబును, సుమనోఫలప్రాచుర్యంబగుట భగసత్ప్రసాదంబును
వివిధపత్రసమగ్రంబగుట వాహినీప్రకరంబును, విపులసువర్ణనవమణి

శిలాసంఘటితంబగుట రాజమకుటంబునుగగన గంగాలింగిత శృంగ
బగుట శివశీర్షంబుననుకరించి.

ఉ. సత్ప్రథవర్తనాంచితుఁడు సంతత సాధుజనౌఘ వేష్టితుం
డుత్పటు వాహినీవిభవుఁ డుత్కలికాగమ విశ్రుతుండు భూ
భృత్పతిమౌళి సన్నిహిత పేశలపత్త్రుఁడు కుండినాచలా
భృత్పతి చెన్ను మీఱు బలభిద్బలనిగ్రహ విగ్రహంబునన్.

ఉ. ఆకుధరాగ్రసీమల మహామునివర్యులు యోగసాధనా
స్తోకుల మోఘమానుల తుల్యపరాపరతత్త్వబోధదీ
ప్తాకలితుల్ విరించి హరి శంకరపాదము లాత్మనిల్పి ని
ర్వ్యాకులరీతి నిశ్చలత పంబొనరింపుచునుండి రందఱున్.

వ. ఇట్లు బహుకాలంబు వసించి తపంబొనరింపుచుండ నమ్మూర్తిత్రయం
నుంగరుణించి మునులకుం బ్రత్యక్షంబగుటయు.

సీ. పటునిదాఘాతప పరితప్త చాతకం
బులు మబ్బుఁగనుగొన్న మోదమొప్ప
నవచంద్రికార్ద్రిత నాళీకములు భాస్క
రోదయద్యుతిఁగన్న యొప్పుగులుక
సతతదరిద్రపీడితమానవౌఘంబు
పెన్నిధిఁగాంచిన ప్రియమెలర్ప
విపులక్షుచ్ఛోషిత విహగకిశోరముల్
తల్లిరాకలుగన్న తమకమెసగ.

తే.గీ. మిం మసంభ్రమమున సంయమివ్రజంబు
లధికభక్తిఁ బ్రణామంబు లాచరించి
శీర్షవిన్యస్తహస్తులై హర్షమొదవ
కనులపండువుగాగ దర్శనమొనర్ప. 80

వ. అంతనామూర్తిత్రయంబు నమ్మునుల సంగతికిం బొంగి మనోభీష్టం
బు దెలుపుడనుటయు.

క. పరిపరివిధముల మౌనులు, హరిహరశతధృతులనుతుల నలరించిగిర

చిరకాలము తారుండఁగఁ, గరుణింపుఁడు వేఱుకోర్కెఁగల్గ దుమదిలోన్. 87

వ. అనిన విని యమ్మూర్తిత్రయంబు గరుణించి మునిసత్తములారా! మీర
లు దేవాంశసంభవులై భూతలంబున నున్నవారు. మీతపోమహా
త్మ్యంబున లోకంబు పవిత్రంబగుఁ, గొంతకాలం బీకుధరంబుపై తపంబు
సేయుచుండవలయు, నిచటికి సురసిద్ధసాధ్య యక్షగంధర్వ ప్రముఖులరు
దెంచుచుందు రీభూధరంబు మిగుల పుణ్యస్థలంబయి యనవరత రత
మానివాసంబులగు పురంబులకు పురంబై బహురాజ పరిపాలనంబున
కొంతకాలంబుకుండి నాభిధానంబునను పిదప కొండవీటి నామంబు
నను ప్రసిద్ధంబై యుండు మీవలయునట్లు మామూర్త్యంశంబుల నీకు
ధరంబున వసింతుమని యానతిచ్చి తత్ప్రకారంబుగా నీపర్వతశిఖరం
బులు మూటియందును కించిత్స్వేతపర్ణసమాకీర్ణంబగు దానిపై విష్ణుం
డు శ్రీబొల్లుమూరు వేంకటేశ్వరాభిధానంబునను, తదీశాన్యభాగ
శిఖరంబున నీశానుండు కైలాసరాయుండను పేరను, తత్సమీపంబు
నఁగల శిఖరంబున బ్రహ్మదేవుండ దృశ్యరూపంబునను, నిలిచి రుద్రాల
యాంగణశిలాతలంబున రుద్రపాదంబనుదాని, నేకాలంబును, పొంగు
గుంగులను, వర్ణరౌచ్యంబులనుఁ గృష్ణోదకంబును బోలు నీరంబునం
బూరంబై యుండు నటుల నిజమహాత్మ్యంబుల నలరించి యదృశ్యు
లైరంత. 88

తే-గీ. సంయమిప్రకరంబతిసంభ్రమమున
నాలయంబుల నిర్మించి యందు ముగురు
మూర్తులను భక్తి నిల్పి సక్రమోచితముగను
పూజగావింపుచుండిరే ప్రొద్దునందు. 89

క. సురవిద్యాధరకిన్నర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వులు నీ
గిరిపై త్రిమూర్తిపూజల, నురుభక్తిని సల్పవచ్చి చుందురు వేడ్కన్.

వ. అట్టియెడల దేవకన్యకలు జలక్రీడాభిలాషాయత్తచిత్తంబుల మొత్తం
బులై వియత్తలంబునుండి వచ్చి శ్రీవేంకటేశ్వరస్థితశిఖరాగ్నేయభా
గంబునంగల గురునాథపర్వతాగ్రంబునందు. 91

కన్యకల పుష్కరిణివర్ణన.

సీ. వితతాంబుజాతసంగతమరందాస్వాదనాజస్రమధుపగానాన్వితంబు
పంక్తిలక్ష్మీచికాంచనమృగాంకోపలనిస్తంద్రసోపానని స్తులంబు
కచ్ఛపమీననక్రకుళీరముఖరాంబుజంతుసంతానవాసస్థలంబు
పవనకంపితలతాపతితకౌసుమరజోపూరిత సురభిళాంబుద్బుదంబు. 9

తే.గీ. నాచుబకహంసచక్రవాకాదివిహగ
నివహనిస్వనని బిడమైనిఖిల జంతు
జీవనాధారముగను సృజించిరచట
కన్యకల పుష్కరిణినాఁగ్రాలుచుండ.

వ. అందు. 9

జలక్రీడాభివర్ణన.

తే.గీ. వేలుపుంబువ్వుబోడులువేడ్కలొప్ప
దినదినమునిత్యకృత్యముల్దీర్చికొనఁగ
నీర్కొలనికేగుదెంచితన్నియతినిల్చి
వారికేళినిఁదేలుచువారిలోన. 9

ఉ. పొమ్మసిలంగ నొండొరులసూటిగఁజూచుచు నీటిలోపలన్
జిమ్మనగ్రోవులంజలముజిమ్ముచుఁ గొందఱుస్వర్ణపాత్రలన్
గ్రుమ్మిపయింబడన్ విసరుకొమ్మలుగొందఱు నాత్తలంబ్రమో
దమ్మునఁదమ్ములన్విరచితారొకనిపువ్వులఁ వ్రేటులాడుచోన్. 95

ఉ. ఒక్కతెనీటఁదోఁగమఱియొక్కతెసక్కెముమీఱ వెన్కగా
తెక్కలియైపరందమునుదృక్కులనంజనమట్లు వెట్టఁదా
మిక్కిలి విభ్రమంబెసగమీననిభేక్షణనీదులాటలన్
దక్కగనూనిపట్టికొనిదర్పమడంగముడుంగ జేసెడున్. 9

తే.గీ. అబలనొక్కర్తుగొందఱుహాస్యరసము
పూర్తిగమొగంబునహరిద్రపూసినట్లు
సుమరజములందిము త్తెంపుసొబగుగ్రాలు
ప్రాయుగతిజల్లెజలబిందువులకరముల.

తే-గీ. ఇట్లుసురసిద్ధసాధ్యాదుౝలెల్ల నిచట
నిత్యకృత్యముల్ దీర్చుచుౝనియతితోడ
వచ్చుచుండుకతంబునౝవసుధ కెల్ల
పావనంబయి యొప్పెనౝప్పర్వతంబు. 98

వ. మఱియు నపర్వతనివాసులగు సమ్మూర్తిత్రయంబును ఖేచరసంయమి
ప్రకరంబును రుద్రపాదాది,దివ్యస్థలంబులును, దర్శింపధరా వలయం
బునంగల మానవులెల్ల నరుదెంచిసేవింపుచు నీస్థలంబునఁగుండినాభి
ధానంబున నొకపట్టణంబును నిర్మించికొనుటయు. 99

కుండినపురవర్ణనము.

చ. ధరణినిఁగౌశికుండు మునుౝదాతకుమాఱుగసృష్టిసేయుచోఁ
వరగుణదోషముల్ దెలుపుౝవైఖరిఁగంధిని ముందొనర్పఁదా
ప్రమచిరనిర్మలత్వమధుౝరప్రచురాంబువులిందుగూర్పనా
శరనిధిఁగెల్చెనాఁ బరిఘుౝజాసగు భంగమిళత్థగంగయై. 100

సీ. పాతాళమునడాగిౝవసుధమోవకయున్న శేషస్థితినియుద్దిౝసెప్పవచ్చు
పుణ్యజనారిచేబూన్కి నొందకయున్నఁ జక్రంబుతులయనిచాటవచ్చు
అచిరకాలస్థితంౝబయినశింపకయున్నఁ బరివేషమెనయనిౝబల్కవచ్చు
అతితమిస్రసునదృౝశ్యదశనొందకయున్నఁ జక్రవాళముసరిౝసల్పవచ్చు
తే-గీ. ననజగద్ధితవైఖరుౝలలరుౝచుండు
చండతరభండనోద్దండౝకాండతుండి
పటుభటానేకవిక్రమౝప్రాపకంబు
స్థిరమణీగణరుచిరంబుౝవరణవరము. 101

ధ్వని.

తే-గీ. క్రొమ్మొగులు చికురులు బుతుౝకులముకంఠ
సరములులసన్నిటాలంబుౝచంద్రరేఖ
సాంధ్యరాగకాశ్మీరచర్చలుదలిర్చు
కొమ్మలనఁబెంపలరుకోటౝకోన్మలలరు. 102

ఉ. కాపురముల్ సురాలయనిౝకాయ్యచరద్గణికాంగనాళికిౝ

దాపురముల్ ప్రభూతమణిధామహిరణ్మయకేతుకోటికిఁ
భూపురముల్ శిరోగృహసమూహపతజ్జలయంత్రపాళికిఁ
గోపురముల్ రహిం జెలయుగోపురచుంబనడంబనక్రియన్. 103

సీ. అచిరప్రభావిశేషచిరత్నరత్నసంచయసమృద్ధిపయోధిసౌధవీధి
అత్యున్నతోచ్ఛ్రయాహంక్రియాక్రమితార్కశశిమండలనిరోధిసౌధవీధి
ఆకాశమండలాయతమండనితభూరిసారచిత్రశిరోధిసౌధవీధి
విపులప్రతాపసంవృతవిద్విషచ్ఛిత్తసతతార్పితవ్యాధిసౌధవీధి.

తే-గీ. వితతనిర్యద్ధుమంఘుమామోద్భుతసుధూప
చంద్రకాంతోపలనిబద్ధశాతకుంభ
జాలమధ్యస్థలపురదర్శనకుతూహ
లాధికచరత్సతీబోధిసౌధవీధి. 104

మ. తమసౌధాగ్రములన్ వసంతములనుద్యత్త్వాళమాధుర్యగా
నమృదుస్నానములన్ దుషారజలయంత్రశ్రీలకేశాళిసం
భ్రమసంవాసిత దివ్యధూపములరామల్ ప్రేమలంగాలమే
ఘ మహావ్యాప్తియటంచుచాతకములాకాశంబునం దాడెడున్. 105

సీ. కలకంఠమాధుర్యగానాన్వితంబౌటభూమిజాతాస్తోకభూతిగనుట
సముదిత మధుపానసుమనోవ్రజంబౌటబహుళద్విజాళివిభ్రాజమగుట
తతశిలీముఖసమంచితనిస్వనంబౌట నర్జునప్రముఖవిఖ్యాతమగుట
నవదివ్యఫలకలనాకల్పకుజమౌట వరసర్వమంగళావ్యాప్తమగుట

తే-గీ. నర్తశాలాంబుజోదరనాకసవన
రాజితాయోధనతలభాసరతవినోద
సురతర వృషేశ మహిమాభిశోభితంబు
వైభవ ఘనంబు నుద్యానవనచయంబు. 106

సీ. నామవిశేషంబునకుఁబాడబులెకానిగుణమునబాడబకులులుకారు
నామవిశేషంబునకుఁగుభృత్తులెకానినడవడినిగుభృదన్వయులుకాగ
నామవిశేషంబునకుఁదృతీయులెకానిసద్వృత్తికిఁదృతీయసమితికాదు
నామవిశేషంబునకుఁ గాపులేకాని వర్తనలోకాపువారుకారు.

తే-గీ. నాఁగఁ దనరారునాల్గువర్ణములుకల్గి
యధికసంపత్ప్రకాశత నలరుదివ్య
వైఖరిభ్రాజితంబున వైభవంబు
ఘనతరప్రాభవంబుకుండినపురంబు. 107

పుష్పలావికావర్ణన.

సీ. జామ! పండుకొనెద సరసపువెలఁబల్కు పండుకొండువిక జీవముండనిమ్ము
ఇఁక బేరమాడనేల కుచమ్ములిటు వెమ్ముకరముగొను సులభకరములగును
అటులనే గొనెదనే నడిగెడునది చెప్పఁడుగు నీకింకేమి యవసరంబొ
ఇంకేమికలదో నీవీవస్త్రమునుఁ దీయుమిటుఁ దీయనర్హుఁగుమా యిఁకటిదాక
తే-గీ. నని యొకరికొకరు సరస మాడుచు వెను
ముందు రసికులు పండ్లమ్ము పువ్వుబోండ్లు
బేరమాడుచుఁ గొనునమ్ము వారివలెను
తిరుగుచుందురు వీధినప్పురమునందు. 108

తే-గీ. ఆనగరివిదర్భకురాజ ధానిగాఁగ
బల పరాక్రమ వివశులై పరగినట్టి
పెక్కురాజులు నివసించి పెంపుడెంపు
గలిగిపాలింపుటయుఁ గొంత కాలమునకు. 109

భీమభూపాలునికథ.

భగవత్ప్రభు పరార్థ గర్భిత సీసము.

శ్రీచక్రవర్తినాఁ జెలువారునెవ్వాఁడు తతశంఖ బలముచేఁ దనరునెవ్వ
డాశుగజాత సమన్వితుఁడెవ్వాఁడు వ్యాళమర్దన కీర్తి వరలునెవ్వ
డఖిలభూమిరమాహృదధిపతి యెవ్వాఁడు ప్రబలఘనాఘన భ్రాజియెవ్వ
డిలనురామాకృతి నింపారునెవ్వాఁడు తరుణలబ్ధపతంగ ధాముఁడెవ్వ
తే-గీ. డుజ్జ్వలానంతపదవిభూ త్యుదితుఁడెవ్వ
డహితమండల హరుడన నలరునెవ్వ
డతఁడు భూవిష్ణువనఁగనొ ప్పారుచుండు
భాసుర యశుండు భీమ భూపాలకుండు. 110

తే-గీ. అమ్మహాపట్టణంబున । కధిపుఁడగుచు
ధర్మగుణవృద్ధిచేత భూ।తలము నెల్ల
ధర్మగుణవృద్ధి దనరగా । దండి మెఱసి
పెంపుమిగులంగఁ బుడమిఁ బా।లింపుచుండె. 11'

క. దమయంతియనెడుతనయను
దముదాంతదమనులు నాఁ।దనరెడుసుతులన్
విమలచరిత్రుఁడు గాంచెను
క్షమఁదమప్రఖ్యాతులెల్ల । సంసిద్ధింపన్. 11

వ. అందు మందగమన జిత మద దంతియగు దమయంతి సంప్రాప్తయౌ
వనయగుటయు భీముండు కూతుంజూచి పెండ్లిసేయ సమకట్టి స్వమతి
చితంబుగా స్వయంవరంబుసేయఁ గృతనిశ్చయుండై వసంతకాలంబున
నొక్కసుముహూర్తంబు విచారించి తత్కాలంబునకు నిరీక్షింపుచుఁ బు
రంబు విచిత్రతరంబుగా నలంకారంబు సేయించి చారులచేనివర్తమ
నంబు భూవలంబెల్లం దెల్లంబుగాఁ జాటనను పుటయు నివార్తపత్రి
కంబులం దెలియునటుల ప్రచురింపుటయును. 11

వసంతఋతువర్ణన.

ఉ. అంత నితాంత సమ్మదహృ।దంతరుఁడౌచు వసంతుఁడప్పుడ
త్యంత కుతూహలంబున స్వ।యంవరవార్త నెఱింగి భీమభూ
కాంతజ తన్ను మున్న చనఁ। గాంతునిగా వరియించు నంచునో
స్వాంతగతానురాగ పరి।వారయుతంబుగఁ బొల్చె నెంతయున్. 1

సీ. వనచరాప్త్యనుపమ । వర్తనం బింపార ముఖరశిలీముఖ । స్ఫురణబా
పత్రిపత్రవిహార । భావమింపలరారవితతమహాబలా । ద్భుతము మీ
కృష్ణాత్మకద్విజ । ప్రియవచోన్నతి దేరను మనఃఫలప్రాప్తి । సొంపుడీఁ
సకలాగమాంతవా।సనలచేరసమూరపరమహంసాశ్రమా।దరముగాంగ
తే-గీ. నొరులెవరుఁ గానకుండఁగ । నుత్సవమున
మాధవుఁడు మాధవాకార । మహిమ దాల్చి
వెడలెను స్వయంవరమహో।భివివశుఁడగుచు

తరుణిప్రభాతి యెంతటివారిం దవులుగాదె. 115

సీ. తొంటివల్వలు విచ్చి తోరంపుఁబన్నీటమజ్జనం బాడి నిర్మలదుకూల
ములు గట్టి పసిఁడిసొమ్ములు దాల్చి చందనమాదిసౌరభవస్తువుల ధరించి
నెఱికురుల్ దువ్వి వెన్నెలకీల్జడ నమర్చి ప్రకటసుగంధపుష్పములఁ జెక్కి
కెంగేల వీడ్యంబు గీలించి పల్మారు సరసంబులాడెడు సఖియకరణి

తే-గీ. వనరమా దేవి మనమున వలపు మిగిలి
మాధవాగమనమున నిర్మల విభూష
భూషితశరీరయగుచు విభూతి వెలయ
దలపు లూరంగ వరియింప నిలచెననగ. 116

క. తొలికారాకులు విదిలిచి, తొలకరి వానలను గ్రుంకి దుర్గవనంబుల్
లలిత కిసాలయ సుమసం, కలితములై తగె వసంతకాలమహిమచేన్.

ఉ. అదిగని సేతుహిమకుధరాంతరభూపతులెల్ల వేగిరన్
ముదిత వరించునంచుఁ గడు మోదమునం జతురంగవైభవా
స్పదులయి భేరికాహళరవంబుల దిక్కులు పిక్కటిల్లఁగ స
మ్మదమున నేగుచుండిరి సముజ్జ్వలరూపగుణాభిజాత్యులై. 118

దమయంతి స్వయంవరవృత్తాంతము.

చ. రథముల నెక్కి కొందఱుఁ దురంగచయంబుల నెక్కి కొందఱున్
కుధరనిభంబులౌ సమదకుంజరయూధము లెక్కి కొందఱున్
అధరితపుష్పకాంచిత విహాయసయానము లెక్కి కొందఱున్
పృథివిపతుల్ ప్రధానపరివేష్టితులై యటకేగుచుండఁగన్. 119

క. ఉర్వీపతులం బలె భువి, బర్వులిడుచుఁ గొందఱూర్ధ్వపదమున జలజా
ప్తార్వములు బర్వగతిని సు, పర్వాణులు వెడలి రతివ వరియింపంగన్.

వ. ఆసమయంబున. 121

సీ. కరిహరిఖురపుటీఘట్టనోద్ధూత పరాగంబు వార్షికాభ్రంబుగాగ
రథనేమి ఘంటికాయుధభృద్భటాహ్వానరావంబు దీర్ఘగర్జనముగాగ
ధ్వజభూరిరసచిత్రితపటయుగ్ధగధగల్ సాద్భుతచంచలాచ్ఛాయగాగ
తత్పురనారీవితానహస్తోత్క్షిప్తపత్త్రమములు నీరకణములుగాగ

తే-గీ. హరిణమదగంధహిమమహాలుక కాభిసిక్త
నృపతను స్ఫూర్తచామరానీతవాత
మతులసుఖకరమలయమారుతముగాగ
వర్షఋతురీతినాస్వయంవరముబొల్చె. 12

వ. ఇట్లుచనుదెంచిన భూపాలక ప్రముఖంబులకు భీముండెదురం జని స
లోపచారంబులఁ బురంబునకురావించి సకలమణి నికరంబులఁ బ్రకటి
తంబులగు చిత్రంపుబొమ్మలకిమ్ములగు కుడ్యంబులును గోమేధిక పుష్య
రాగప్రముఖోపల ఖచిత సింహాసనంబులును విచిత్రతరదీపికాచయం
బులును విమల చీనిచీనాంబరంబులరాజిల్లు వితానంబులును రత్నము
క్తాఫల వ్రాత సంకలిత తోరణంబులును వివిధపట విశేషంబులును
గలిగి మిగుల దివ్యాలంకృతంబైన సభాభవనంబునకుబిలిపించి యు
తాసనాసీనులం జేసిన. 1

సభావర్ణనక్రమాలంకారము.

సీ. రాజేనరత్నముల్ కరాజేనరత్నముల్ రమణీయ తేజోవికారాజులగుట
గురుబుధప్రముఖులు గురుబుధప్రముఖులుస్థిరదసంతాసనాసీనులగు
సన్మార్గవర్తనుల్ కసన్మార్గవర్తనుల్ సకలాగమపదానుసరణులగుట
నిగమపాలకముఖుల్ నిగమపాలకముఖుల్ శ్రౌతనిష్ఠాతానుచారులగు

తే-గీ. దుర్గమపయోధిదుర్గంబు దుర్యస్థలంబు
కవిసభాస్థానభవనంబు దివియుఁబున్యా
జనపదముయజ్ఞవాటంబు సార్వభౌమ
సముఖమునునాగఁదద్రాజ సభదలిర్చె. 1

వ. తదాస్థానంబునందు సకలదాతృసనాథుండగు భీమభూనాథుం
సఖీజనపరివేష్టితయైన దమయంతినిరావించి ప్రేమాతిరేకంబున స
వీక్షింజేర్చి సభాసదులంజూపుచు నిట్లనియె. 1

ఉ. వీరుధరాధినాథులతి వీరులుసత్యపథప్రవర్తనా
చారులుసద్యశోధనవి శారదులాకృతిమారులుర్ మహా

శూరులు నీ స్వయంవరముఁ జూడగ నిచ్చలు మెచ్చివచ్చియు
న్నారెదఁ గోరినట్టినృప నందనునిన్ వరియింపు కోమలీ. 126

దమయంతి నలుని వరించుట.

వ. అని సమయోచితంబుగాఁ బలికి వీడ్కొలిపిన నమ్మందయాన మందగమనంబున. 127

సీ. తరుణహృద్భేదనో ద్ధతిజూపు మరునిక్షు
చాపయష్టినిఁ గుచ్ఛ శరమనంగ
నుర్వీపహృదయాబ్ధు లుప్పొంగ భీమ పూ
ర్వగిరిపై వెడలు చం ద్రకళయనగ
నిరుపమశృంగార సరసాభినయకళా
ద్భుతమైనజంత్రపు బొమ్మయనగ
లోకవిభ్రమసమా లోకనాశ్చర్యకృ
ల్లలితస్థిరాంశుచం చలయనంగ.
తే-గీ. కనకమణిమయభూషణో త్కరము గ్రాల
బాలప్రమోలన్మ పాలకధాళివంశ
లీలలు వచింపనిరుగడల్ గోలలిరుపు
రుచ్చరింపంగ వెడలెన త్యుత్సవమున. 128

ఉ. రాజులనద్యశోధనవి రాజులచారుతనుజ్వలోజ్జసీ
రాజులరూపధూతరతి రాజులభూరివిభూతిజైత్రగో
రాజులశౌర్యధైర్యమృగ రాజులభక్తజనావనాంబికా
రాజులదానకర్ణశిబి రాజులరాజులఁ గాంచుచుందగన్. 129

మ. వరియించెన్ జతురర్ణవావృతధరా వామేతుసాక్షిణిని
ష్ఫురవత్కోజయుగస్థశక్తమణిరిం ఛోళీస్ఫురద్ధారవి
స్తరతేజోమయనూత్నరత్ననిభబా స్వన్నైషదాభిఖ్యచే
శరమావల్లభవీరసేనతనయున్ స్ఫారానలున్ శ్రీనలున్. 130

దమయంతి వివాహము.

వ. అంత భీమభూకాంతుండ మందానంద కందళిత హృదయారవిందుండై

యేతద్వృత్తాంతంబునం దిపురంబునకనిపి వారలిరువురకుం బరిణయ
బొనర్పం గృతనిశ్చయుండై. 13

సీ. గురువర్యుడై వజ్ఞకోవిదప్రకరాజ్ఞ
నిర్మలలగ్నంబు నిశ్చయించి
సురుచిరంబుగనిజపురమలంకారించి
ఘనవాద్యములు సెలంగనియమించి
భూరిసంభావనంబులనలబూజించి
బుధజనాశీర్వాదములగ్రహించి
వారకాంతాలాస్యచారుప్రతోళికా
పరిణయోత్సవకళాపటలినించి.

తే-గీ. నీలముక్తాదిమణిమయాట్టాలకమున
రత్నసింహాసనంబునరమణునిల్పి
సకలజనములువినుతింపబ్రకటితముగ
పెండ్లిగావించెలోకసంప్రీతివెలయ. 13

వ. అంత నమ్మహీకాంతుం డత్యంతసంతోషస్వాంతుండై వివాహానంతరంబున సుతాజామాతలం గతిపయకాలంబు నిజమందిరంబున సకల వైభవంబులనోలలార్చి పిదప నిస్తులప్రశస్తంబులగు వస్తువాహన నిచయంబుల ప్రచురంబుగా నిడి సపర్యలొనరింపదాసదాసీజనంబు వెంటనొసంగి దివ్యరథారూఢులంజేసి నిఖిలవాద్యంబులు హృద్యంబుగా మ్రోయ నిషధపురంబునకనిపి యతండు సుఖావహుండై పెక్కు కాలంబు విదర్భదేశంబు పాలించె ననంతరంబ తదీయాన్వయజులగు నృపులనేకులును ప్రభుత్వంబుసేయుటయు ద్వాపారంబునందు. 13

## భీష్మునికథ.

క. చంద్రాన్వయభవులుయశ, స్సాంద్రులునిబిడాహవప్రశస్తచరితులు
చంద్రార్కకీర్తిపథని, స్తంద్రులగుచునేలిరచట జయనయపరులై
వ. అందు, 13

సీ. ఏరసావల్లభు ఘోరసంగ్రామంబు గ్రామంబు జయపురమా గారమునకు
నేజయశీలుని రాజత్ప్రతాపంబు తాపంబు వైరిసంతానమునకు
నేక్షమాపాలుని టాక్షప్రసారంబు సారంబు కోవిద సంఘమునకు
నేజనాగ్రణిలస త్తేజోభిమానంబు మానంబు దశదిశామానినులకు

తే–గీ: అతఁడు సప్తాంతరీపమ ధ్యస్థశస్త
నిస్తులమణిస్థగితరమ ణీయమకుట
తటపరిన్యస్త ప్రాంజలీ పుటనృపౌఘ
వేష్టితసభాంతరుండు శ్రీ భీష్మకుండు. 136

సీ. విగ్రహాతిశయంబు విగ్రహాతిశయంబు సుందరవిజయభా సురముఁజూప
విక్రమస్ఫురణంబు విక్రమస్ఫురణంబు బహుధృతిభూభార పటిమదెలుప
దానవిశేషంబు దానవిశేషంబు సజ్జనాదృతిరిపు క్షయమువరప
ధర్మగుణోన్నతి ధర్మగుణోన్నతి దుష్కృత ద్వేషణాతురమునడప

తే–గీ. సకలదిగ్విజయశ్రీ ప్రసాదనమహిమ
చేతనుదయాస్తగిరి సేతు శీతశైల
మధ్యసర్వంసహాధిసా మ్రాజ్యపదవి
నోలలాడుచుఁగుండిన మేలుచుండె. 137

వ. ఇట్లతఁడ ఖండితైశ్వర్యవిరాజమానుండై పాలింపుచు గిరిశృంగంబుల
మునీంద్ర ప్రేరిత స్వయంప్రకాశ భాసమానులగు మూర్తిత్రయం
బుల ననయంబునుఁ బూజింపుచుఁ దదీయాలయంబుల నూత్నఫక్కిం
గట్టించి యాదేవులకు నిత్యోత్సవవారోత్సవ పక్షోత్సవ మాసోత్సవ
సంవత్సరోత్సవా ద్యుత్సవ విశేషంబుల నొనరింపుచు. 138

చ. అనయము దేవభూసురస మాదరణైక విరాజమానుఁడై
దినదినముం బురాణముల దివ్యకథానుగతప్రశంసలన్
మనమిడిన స్తసంతతుల సుర్త్వత్కై పచరింపుచుం బురం
బునకుధ నేశుపార్శ్వమున భోల్పగుచుండెడు చిన్నికొండపై
ఘనమగునాలయంబొకటి గట్టెసగాత్మజసి ల్పెభ క్తితోన్. 139

